## శక్త్యుపాసనకు పిక్క-మాంసము, నెత్తురు?

యువకునిపై మత్తుమందుప్రయోగము, పోలీసువిచారణ.

బళ్లారి, సెప్టెంబరు ౨౩:-

రామచంద్రగుప్త అను ౧౭ సంవత్సరముల యీడుగల వైశ్యయువకుడు బళ్లారిపురపాలకోన్నత పాఠశాల ఆయిదవఫారమువిద్యార్థి నిన్న గ్రహణస్నానముచేసి సైకిలుపై కాఫీహోటలుకుపోవుచుండగా, ఎవరో ఒకరు అతని దేహముమీద పొడరుచల్లెనట- కాఫీహోటలుకు వెళ్లుటకుమారుగా, గుప్త బళ్లారిలో కొండదగ్గరవున్న "కుమ్మరకుంట"కు అదేసైకిలుపై వెళ్లెను- అచ్చటసైకిలుపెట్టి కొండఎక్క-నట-మరలఅచ్చట అదేమనిషి వచ్చి మత్తుమందు దేహముపై చల్లెను-వెంటనే గుప్త స్పృహతప్పిపడిపోయెను-మరల తెలివివచ్చి చూసుకొనునప్పటికి కుడికాలిపిక్క-కండ కోయబడియుండెను-పీకచుట్టూ బలమైన కత్తిగాయముండెను- నెత్తురుచాలాపోయివుండెను- ఎడమచేతిపైనకూడా కత్తిగీట్లుండి నెత్తురుపోయివుండెను-దగ్గరఎవరూలేనందుచేత దేకుకుంటూ తనసైకిలున్నదగ్గరకువచ్చి ఒకేకాలుతో సైకిలు తొక్కు-కొనుచూవచ్చి పూరించయటనున్న షేగుగుడిసెలదగ్గరపడిపోయెను-వెంటనే ఖబురు తెలిసి గుప్తయిచటి ప్రభుత్వఆసుపత్రిలో చేర్చబడెను-డాక్టరు గాయములు తీవ్రమైనవనియు, ఆయినను నయముకావచ్చునియు అభిప్రాయపడుచున్నారు- పోలీసువారు శిక్షాస్మృతి ౩౨౮ సి.సి-ప్రకారము కేసురిజిష్టరుచేసుకున్నారు-సబుమేజస్ట్రేటుగారు గుప్తమరణవాఙ్మూలమును వ్రాసుకొనిరి-అందులో పైరీతిగా వివరములు చెప్పబడినవి-

నిన్న సూర్యగ్రహణమగుటచేత, శక్తిఉపాసకులెట్టిచర్యలకు పూనినవనియు, గుప్తకాలిపిక్క-మాంసమును, నెత్తురునుతీసికొనిపోవుటకు అఘోరాచారము నెవరో శక్తిపూజచేయువారు కావించినవనియు, వార్త ఊరంతావ్యాపించి ఆలజడికలిగించుచున్నది,

పోలీసుదర్యాప్తుసాగుచున్నది- పోలీసువారు నేడు కొండమీద నేరముజరిగినస్థలమును చూచుటకై వెళ్లిరి-గుప్తచేతియుండిన బంగారపుఉంగరము, రిష్టువాచీపోలేదు- ఏవంకయూ రక్తసిక్తమైనది- గుప్త వ్యాయామశిక్షణ పొందియుండెను.

(ఆంధ్రపత్రి)

—

## "దుర్బలులు జారిపోతే కాంగ్రెసుకు మరింతబలం"

ఉత్కళ కాంగ్రెసు అధ్యక్షునికి గాంధిమహాత్ముని సమాధానము

కరాచీ, సెప్టెంబరు ౨౫

ఒరిస్సారాష్ట్రంలో సంయుక్తమంత్రివర్గము స్థాపించేప్రయత్నాలను గురించి ఉత్కళరాష్ట్ర కాంగ్రెసుకమిటీఅధ్యక్షుడు ప్రాణకృష్ణపాధియారీకి మహాత్మా గాంధీగారు ఈవిధంగా సమాధానము వ్రాసిరి:

"మీరువ్రాసిన సమాచారమువల్ల నా ఉత్సాహమునన్నగిల్లలేదు. పుట్టినవారందరుమ్రబకరు. కొందరైనను తమమాటకు మాత్రుకొనివున్నందుకు నాకుసంతోషముగుచున్నది అమాత్రం ఉత్సాహంలేక నాకుచాలును-మనలనువిడిచిపెట్టినవారు కొరేమంత్రివర్గాన్ని పెట్టకుంటే మనము చింతపడనక్క-రలేదు-దుర్బలులు మనమంచిజారిపోయినందువల్ల మనం మరీ బలవంతులమగుదుము"

పూర్వమంత్రి బోధరామ్‌దూ్యాబే తనపేరును సత్యాగ్రహులజాబితాలోనుంచి తీసివేయవలసినదని రాష్ట్రకాంగ్రెసుసంఘపు అధ్యక్షునికి వ్రాసినశేఖతుగురించి అతనుమహాత్మునికి ఒకప్రశ్న వేసెను-రాష్ట్రకాంగ్రెసుసంఘ సభ్యత్వాలనుంచికూడా అతనురాజీనామా ఇయ్యవలెనని కోరవచ్చునాఅనిమహాత్మునిఆడిగెను. అందుకు గాంధీగారు యీవిధంగా సమాధానంచెప్పిరి. "శాసనధిక్కారం చేయునందుకు తగిన కారణములను అతను ఇవ్వలేదు-కనుక దూ్యబేగారు రాజీనామాయివ్వనక్క-రలేదు."

-----

### హిందూస్థాన్ నేషనల్‌లీగు

ఇదివరకు అఖిలభారత హిందూలీగ్ అని పిలువబడు హిందూస్థాన్ నేషనల్‌లీగుయొక్క- అధ్యక్షుడగు అణేగారు వైస్రాయిమంత్రివర్గములో సభ్యులై వెళ్ళిపోవుటవల్ల ఇప్పుడు జమ్నాదాసు మెహతాగారుదానికధ్యక్షతవహించినారు.

ఈలీగుయొక్క- కార్యకారిణీ సంఘసమావేశము అక్టోబరు ౨౪వ ౨౫వ తేదులలో ఢిల్లీలో జరుగనున్నది. ఇపుడటిరాజకీయ పరిస్థితినిగురించి చర్చించెదరు

—

## న్యాయస్థానోద్యోగులకు! విరాళాల వసూళ్ల నిషేధము

పాట్నా హైకోర్టున్యాయమూర్తి తీర్పు

పాట్నా, సెప్టెంబరు ౧౭—

"ఏదేశములోగాని న్యాయస్థానాలు నేరాలను విచారణచేయవలసివచ్చినప్పుడు శాసనసభలు ఏరీతిగాశాసనములను ఏర్పరిచినవో ఆనిబంధనలను అనుసరించియే విచారణజరుగవలెను- అంతేకాని న్యాయస్థానంలో నేరవిచారణసందర్భములో పార్టీలతరపుగాని, సాక్షిగాగాని, న్యాయవాదిగాగాని వచ్చినిలబడేవ్యక్తిని ధర్మనిధులకుగాని, బహిరంగనిధులకుగాని విరాళాలుయివ్వవలసినదని మేజిస్ట్రేటుగాని మరోక న్యాయశాఖ ఉద్యోగిగాని కోరుటఅక్రమచర్యఅగును ఏపక్షమునుంచి అయినను విరాళాలు స్వీకరించవలెనని ఎవరైనను తెలిపిసూచనలను న్యాయాధికారులు ఆమోదించకూడదు."

అని న్యాయమూర్తి అగర్వాలుగారు నిన్నటిదినం పాట్నాహైకోర్టులోఒకకేసుసందర్భంలో అభిప్రాయమిచ్చిరి-

ఒకక్రిమినలు కేసుసందర్భములో విచారణజరిపిన మేజస్ట్రేటుకావించినఆజ్ఞ అనురద్దుపరచవలసినదనిఒక పార్టీతరపున హైకోర్టుకోరినసందర్భంలో అగర్వాలాగారు ఈఅభిప్రాయము తెలిపిరి.

ఈకేసుసందర్భంలో విచారణ సాగించుటకు తగినన్ని ఆధారాలు లేకపోవుటవలన విచారణలు యూనిపించలేదని, యీఒక పార్టీకిచెందినవారు ఏదోఒకనిధికి రు ౨౦౦లువిరాళంయిచ్చుటకు సమ్మతించినందువలన కేసువిచారణ నిలిచిపోయినదని జస్టిసుఅగర్వాలాగారికి నమ్మకముకలిగినది-

అందువలన తిరిగి కేసువిచారణ చేయవలెననియు, రు ౨౦౦లువిరాళంయిచ్చిన పార్టీకిఆసొమ్మును వాపసుచేయవలసినదనియు న్యాయమూర్తిగారు తీర్పుచెప్పిరి-

—

### అస్సాం కాంగ్రెసువాదికి కఠినశిక్ష

అస్సాంరాష్ట్రంలో శివసాగర్ జిల్లా కాంగ్రెసుసంఘానికి పూర్వఅధ్యక్షులైన రవీంద్రనాథ్ కాకోటిగారు సత్యాగ్రహం జరిపినందుకు వారికి శివసాగర్ సబ్‌డివిజనల్ మేజస్ట్రేటు ఎస్ కె దత్తాగారు భారతదేశరక్షణ నిబంధనలక్రింద ఆరు నెలలుకఠినశిక్ష విధించిరి- ఇదివరలో కాకోటిగారు యిటువంటి నేరంచేసినందుకే నాలుగు నెలలు కఠినశిక్ష అనుభవించి విడుదలఆయిరి-

—





## గోలకొండగ్రంథాలయము

**శ్రీప్రార్థన పద్యావళి**

(గ్రంథకర్త- శ్రీమన్నవ వెంకటరాఘవకృష్ణశర్మగారు. వీరు "ఆంధ్రకవితావిశారదు"లని తమ ముఖపత్రముపై వ్రాసుకొనినదానిబట్టి తెలియుచున్నది, ఇందులో మొత్తం ౩౫పద్యాలున్నవి. అన్నీ భగవత్స్వరూపాన్ని స్తుతించునట్టివే, అన్నిపద్యాలూ సంబోధనతో నడిచినట్టివే. భాషాస్ఖాలిత్యాలూ, యతిస్ఖాలిత్యాలూ ప్రమాదపతితము అనుకోవచ్చును, వీరికి ఆంధ్రకవితా విశారదత్వమేకాక, గీర్వాణపారీణతకూడా కలదని సూచించినారు- పద్యసంఖ్యలోని ౩౫, ౧౨ సంఖ్యలుగలవి శ్లోకాలు, గీర్వాణపాండిత్యానికి ఉదాహరణం:.

శ్లో॥హే రామచంద్రాశ్రయ పాదయాకూ!

.......... .......... ..........

పునంతు మాం త్వచ్చరణారవిందం

శ్లో॥శ్రీరామభద్ర............దీనబంధూ!

.......... .......... ..........

వీరు, రామునకూ- తత్సోదరులకూ అభేదం కల్పించారుకాబోలు! ఉదాహరణ!

శాః శ్రీరామానుజ! ..........................

..........................................

శ్రీరామా హృదయారవిందమధుపా! ....
సీతామనోనాయకా!

ఇందు రాముడూ, తత్సోదరులూఅభిన్నులు. మనస్సు భక్త్యావేశాలకు లోనైయున్నప్పుడు కవిత్వాన్ని లక్షణపాశాలేమీ బంధింపజాలవనిఅనుకొనినట్లున్నారు గ్రంథకర్తగారు-

గ్రంథము కొరకేచోటు, వెలతెలుపబడలేదు.

### శ్రీ శ్రీ టాగూరుగారి స్మరణ

దక్కన్‌లో సాధన జ్ఞానధాలయమువారు శ్రీ శ్రీ డాక్టరురవీంద్రనాథ టాగూరుగారినిగూర్చి భారతదేశములోనివారలును, ముఖ్యపత్రికలును ప్రకటనలలోనిముఖ్యపత్రికలును చేసిన ప్రశంసలనన్నిటిని ఒకచోకేర్చి ౧౭పుటలచిన్నపుస్తకమును ప్రచురించినారు-వెండటివిజ్ఞప్తిలో ఈ అభిప్రాయములలో తమకుచిక్క-నవాటినన్నిటిని చేర్చితిమనియు, కానియింకను ఎన్నియో ప్రశంసలు ఉన్నవనియు చెప్పబడినదిముఖపత్రముపై టాగూరుగారి శ్లోకులోమ్యయున్నది.

—

### ఆకుకూరలు

ప్రచురణకర్తలు"ఆంధ్రభూమిబుక్ డిపో, కోపేరి, మదరాసు"వారు. ౧౨ ప్రటలు రెండుఅణాల (కల్దారు) టపాపట్టెక్కెట్లు పంపిన దొరకగలదు.

ఇందులో ఆనిసెలకుతోప్రారంభించి సీకాయఆకుతోను గియుచు మొత్తము ౩౧ ఆకుకూరలు గావుండుకొనియో, పచ్చివిగానో భుజించియో ఆరోగ్యభాగ్యమునకై ఏమేమిలాభములను పొందవచ్చునో తెలుపబడినది- వాడుకలోఆనకోలే లాభములు వస్తుగుణదీపికఅనబడు గ్రంథాలలో తెలుపబడుటయే ఇందులోనివిశేషము.

—

### దేవీప్రశ్న

అయిదుప్రశ్నలువ్రాసి కవరులోయుంచి పేర్లు తెలిపపంపిన దివేమహిమచే ఫలితములువ్రాసి మీ పేర్ల కవరుసహా పంపుటకు రు 1-6-0 సంవత్సరఫలితములవారి రు 1-12-0 దశలుగల పూర్ణజాతకము రు5-8-0 శ్రీసరస్వతీజ్యోతిషాలయం, కాకినాడ

# ము. ఘు. ప. నిజాం స్టేటు రైల్వే

## అక్టోబరు 1941 నుండి అమలులోనికి వచ్చు ప్యాసింజరు బండ్ల రాకపోకల సంక్షిప్త పట్టిక

## పెద్దలైను

| | | 2 ప్యాసింజరు | 78 రైల్ కార్ | 22 మిక్స్డు | 4 ప్యాసింజరు | 10 రైల్ కార్ | 12 ప్యా. |
|---|---|---|---|---|---|---|---|
| | | గం. ని. | గం. ని. | గం. ని. | గం. ని. | గం. ని. | గం. ని. |
| | | | | ఎక్స్ పర్లి వైజ్యనాథ్ | | ఎక్స్ బీదరు | |
| వాడి ... | పో. | 3 28 | | | 11 56 | | |
| వికారాబాదు ... | వ. | 6 18 | | 20 6 | 14 22 | 17 31 | |
| | పో. | 6 26 | | 20 27 | 14 30 | 17 34 | |
| బేగంపేట ... | ,, | 7 47 | | 22 22 | 15 42 | 18 52 | |
| హైదరాబాదు డి. జ. | వ. | 8 5 | | 22 40 | 15 57 | 19 4 | |
| | పో. | 8 16 | 12 5 | 23 5 | 16 35 | 19 7 | 19 35 |
| సికింద్రాబాదు ... | వ. | 8 35 | 12 22 | 23 40 | 17 6 | 19 32 | 19 52 |
| | పో. | 9 0 | 12 27 | | | | 20 10 |
| భువనగిరి ... | ,, | 10 5 | 13 22 | | | | 21 11 |
| కాజీపేట ... | వ. | 12 10 | 14 56 | | | 14 ఫాస్టు మిక్స్డు | 23 0 |
| | | | | | | | 6 జి.టి. ఎక్స్. 21 22 |
| బల్లార్షా ... | వ. | | | | | | ఎక్స్ ప్రెస్ |
| | పో. | | | | | 8 10 | 21 47 |
| కాజీపేట ... | వ. | | | | | 14 36 | 2 59 |
| | | | | | | 8 ప్యా | |
| | పో. | 12 30 | 15 2 | | | 15 28 | 3 30 |
| వరంగల్ ... | ,, | 12 41 | 15 12 | | | 15 35 | 3 41 |
| డోర్నకల్ జం. ... | వ. | 14 39 | | | | 17 35 | 5 19 |
| | పో. | 14 53 | | | | 17 48 | 5 35 |
| బెజవాడ ... | వ. | 17 52 | | | | 20 55 | 8 40 |
| | | | | | | | మద్రాసు మెయిల్. |
| | పో. | | | | | | 9 5 |

| | | 1 ప్యాసింజరు | 7 ఫాస్టు మిక్స్డు | | | 5 జి.టి. ఎక్స్ప్రెస్ | | | 77 రైల్ కార్ |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | గం. ని. | గం. ని. | గం. ని. | గం. ని. | గం. ని. | | | గం. ని. |
| బెజవాడ | వ. | ... | ... | | | 17 30 మద్రాసు నుండి | | | |
| | పో. | 6 15 | 8 45 | | | 17 54 | | | |
| డోర్నకల్ జంక్షను | వ. | 9 32 | 12 34 | | | 20 34 | | | |
| | పో. | 9 46 | 12 49 | | | 20 54 | | | |
| వరంగల్ ... | ,, | 11 47 | 15 31 | | | 22 37 | | | 16 25 |
| కాజీపేట | వ. | 12 3 | 16 0 | | | 22 52 | | | 16 36 |
| | | | 13 ఫా. మి. | | | | | | |
| | పో. | | 16 50 | | | 23 22 | | | |
| బల్లార్షా | వ. | | 23 35 | | | 4 50 ఢిల్లీకి పోవును | | | |
| | పో. | | | | | 5 11 | | | |
| | | | | 11 ప్యా | 9 రైల్ కార్ | | 3 ప్యాసింజరు | 21 మిక్స్డు | |
| కాజీపేట | వ. | | | | | | | | |
| | పో. | 12 14 | | 3 26 | | | | | 16 39 |
| భువనగిరి ... | ,, | 14 33 | | 5 22 | | | | | 18 17 |
| సికింద్రాబాదు | వ. | 15 42 | 1 ప్యా | 6 26 | గం. ని. | | గం. ని. | గం. ని. | 19 10 |
| | పో. | 15 52 | 17 12 | 6 40 | 10 0 | | 9 8 | 5 40 | 19 14 |
| హైదరాబాదు డి. జ. | వ. | 16 12 | 17 29 | 7 8 | 10 13 | | 9 37 | 6 5 | 19 28 |
| | పో. | ... | 17 39 | | 10 15 | | 9 45 | 6 18 | |
| బేగంపేట ... | ,, | | 17 53 | | 10 28 | | 9 57 | 6 37 | |
| వికారాబాదు | వ. | | 19 27 | | 11 46 | | 11 18 | 9 2 | |
| | పో. | | 19 37 | | 11 48 | | 11 38 | 9 17 | |
| వాడి ... | వ. | | 22 10 | | బీదరుకు | | 14 22 | పర్లి | |

### బ్రాంచి లైను బండ్లు

#### వికారాబాదు — పర్లి వైజ్యనాథ్ శాఖ

| | | 21 మిక్స్డు | 9 రైల్ కార్ | | | 10 రైల్ కార్ | 22 మిక్స్డు |
|---|---|---|---|---|---|---|---|
| | | గం. ని. సికింద్రాబాదు నుండి | గం. ని. సికింద్రాబాదు నుండి | | | గం. ని. | గం. ని. |
| వికారాబాదు | వ. | 9 2 | 11 46 | పర్లి-వైజ్యనాథ్ | వ. | | |
| | పో. | 9 17 | 11 48 | | పో. | | 6 30 |
| మహబూబాబాదు-బీదరు | వ. | 12 50 | 13 36 | మహబూబాబాదు-బీదరు | వ. | | 15 34 |
| | పో. | 13 43 | | | పో. | 15 44 | 16 36 |
| పర్లి-వైజ్యనాథ్ | వ. | 22 15 | | వికారాబాదు | వ. | 17 31 | 20 6 |
| | పో. | | | | పో. | 17 34 | 20 27 |
| | | | | | | సికిం.కు | సికిం.కు |

#### డోర్నకల్ జంక్షను - సింగరేణి కాలరీసు శాఖ

| | 16 మిక్స్డు | | 15 మిక్స్డు |
|---|---|---|---|
| | గం. ని. | | గం. ని. |
| డోర్నకల్ జం. పో. | 9 55 | సింగరేణికాలరీసు పో. | 13 10 |
| సింగరేణికాలరీసు వ. | 11 20 | డోర్నకల్ జం. వ. | 14 20 |

#### డోర్నకల్ జంక్షను - భద్రాచలంరోడ్ శాఖ

| | 18 మిక్స్డు | 20 మిక్స్డు | | 17 మిక్స్డు | 19 మిక్స్డు |
|---|---|---|---|---|---|
| | గం. ని. | గం. ని. | | గం. ని. | గం. ని. |
| డోర్నకల్ జం. పో. | 10 50 | 21 50 | భద్రాచలంరోడ్ పో. | 14 42 | 2 10 |
| భద్రాచలంరోడ్ వ. | 13 18 | 0 20 | డోర్నకల్ జం. వ. | 17 20 | 4 50 |

## చిన్నలైను

| | | 39 షటల్ | 35 ప్యాసింజరు | | | 41 షటల్ |
|---|---|---|---|---|---|---|
| | | గం. ని. | గం. ని. | గం. ని. | గం. ని. | గం. ని. |
| ద్రోణాచలం ... | పో. | 6 40 | 11 10 | | | 15 30 |
| కర్నూల్ టౌను | వ. | 7 53 | 12 20 | | | 16 47 |
| | పో. | 37 ప్యాసింజరు | 12 45 | | | |
| మహబూబునగర్ | వ. | | 16 28 | | | |
| | పో. | 6 20 | 16 36 | 34 ప్యాసింజరు | 30 ప్యాసింజరు | 32 ప్యాసింజరు |
| హైదరాబాద్ దాం. జ. | వ. | 9 52 | 19 26 | | | |
| | పో. | 10 1 | 19 30 | 6 0 | 17 10 | 19 0 |
| సికింద్రాబాదు | వ. | 10 20 | 19 50 | 6 30 | 17 33 | 19 25 |
| | పో. | | | 6 52 | 17 43 | 20 10 |
| నిజామాబాదు | వ. | | | 11 26 | 22 40 | 0 9 |
| | పో. | | | 11 38 | | 0 21 |
| నాందేడ్ ... | ,, | 44 షటల్. | | 14 34 | 54 షటల్ | 2 56 |
| పూర్ణా | వ. | | | 15 21 | | 3 35 |
| | పో. | 19 30 | | 15 46 | 6 15 | 4 0 |
| పర్భని | వ. | 21 0 | | 16 29 | 7 5 | 4 35 |
| | పో. | 21 10 | | 16 39 | 7 15 | 4 45 |
| జాల్నా | వ. | పర్లి | | 19 45 | 10 40 | 7 28 |
| | | | | | 56 ట్రిప్ కోచ్ | |
| | పో. | | | 20 3 | 11 7 | 7 41 |
| ఔరంగాబాద్ ... | ,, | | | 21 37 | 13 15 | 9 19 |
| మన్మాడ్ ... | వ. | | | 0 35 | రాత్రి | 12 20 |

| | | 33 ప్యాసింజరు | 31 ప్యాసింజరు | 55 ట్రిప్ కోచ్ | | |
|---|---|---|---|---|---|---|
| | | గం. ని. | గం. ని. | గం. ని. | గం. ని. | గం. ని. |
| మన్మాడ్ ... | పో. | 1 55 | 13 0 | — | | |
| ఔరంగాబాదు ... | ,, | 4 41 | 15 55 | 13 55 | | |
| జాల్నా | వ. | 6 18 | 17 28 | 15 56 | 43 షటల్, | |
| | | | | 53 షటల్. | | |
| | పో. | 6 30 | 17 41 | 15 15 | పర్లిమండి. | |
| పర్భని | వ. | 9 33 | 20 13 | 19 30 | 4 17 | |
| | పో. | 9 37 | 20 17 | 19 38 | 4 55 | |
| పూర్ణా | వ. | 10 15 | 20 55 | 20 28 | 5 57 | |
| | పో. | 10 40 | 21 17 | | | |
| నాందేడ్ ... | ,, | 11 22 | 22 2 | 29 ప్యా. | | |
| నిజామాబాదు | వ. | 14 35 | 1 4 | | | |
| | పో. | 14 47 | 1 16 | 4 20 | 36 ప్యా. | 38 ప్యా. |
| సికింద్రాబాదు | వ. | 19 33 | 6 0 | 9 40 | | |
| | పో. | 19 53 | 6 18 | 9 50 | 6 48 | 17 40 |
| హైదరాబాదు దాం. జ. | వ. | 20 10 | 6 35 | 10 10 | 6 58 | 17 55 |
| | పో. | | | | 7 8 | 18 0 |
| మహబూబునగర | వ. | 40 షటల్. | | | 9 49 | 21 15 |
| | పో. | | | | 9 57 | |
| కర్నూల్ టౌను | వ. | | | | 13 25 | 42 మిక్స్డ్ |
| | పో. | 8 40 | | | 13 45 | 17 30 |
| ద్రోణాచలం ... | వ. | 10 0 | | | 14 57 | 19 57 |

### బ్రాంచ్ లైను బండ్లు

#### పూర్ణా-హింగోలి శాఖ.

| | 45 మిక్స్డు | | 46 మిక్స్డు |
|---|---|---|---|
| | గం. ని. | | గం. ని. |
| పూర్ణా ... ... పో. | 6 30 | హింగోలి ... ... పో. | 11 35 |
| హింగోలి ... ... వ. | 10 10 | పూర్ణా ... ... వ. | 15 0 |

#### పర్భని-పర్లి-వైజ్యనాథ్ శాఖ

| | | 44 షటల్ | 48 మిక్స్డు | | | 43 షటల్ | 47 మిక్స్డు |
|---|---|---|---|---|---|---|---|
| | | గం. ని. పూర్ణా నుండి | గం. ని. | | | గం. ని. | గం. ని. |
| పర్భని ... | వ. | 21 0 | | పర్లివైజ్యనాథ్ ... | పో. | 1 30 | 5 50 |
| | పో. | 21 10 | 11 5 | పర్భని ... | వ. | 4 17 | 9 10 |
| పర్లివైజ్యనాథ్ | వ. | 0 5 | 14 25 | | పో. | 4 55 పూర్ణాకు | |

#### నిజామాబాదు జానకంపేట్-బోధన్ శాఖ.

| | 50 మిక్స్డు | 52 మిక్స్డు | | 49 మిక్స్డు | 51 మిక్స్డు |
|---|---|---|---|---|---|
| | గం. ని. | గం. ని. | | గం. ని. | గం. ని. |
| నిజామాబాదు... పో. | 6 30 | 18 30 | బోధన్ ... వ. | 9 0 | 21 10 |
| బోధన్ ... వ. | 8 20 | 20 30 | నిజామాబాదు ... పో. | 10 55 | 23 00 |

సికింద్రాబాదు
తేది 15 సెప్టెంబరు 1941

ఎ. డబ్ల్యూ. వాట్సు
చీఫ్ ట్రాన్సుపోర్టేషన్ సూపరింటెండెంటు

౧ సం॥రము చందా ౬ రూపాయిలు
౬ నెలలకు 3 రూపాయిలు
బ్రిటిషిండియాలో సం॥చందా ౫-౮-౦ కల్దారు
పాతపత్రికలకు వెల ప్రత్యేకము.

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

THE ONLY POPULAR PAPER THAT REACHES The masses In the Dominions BEST MEDIUM for Advertisement.

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

Volume 16 | Hyderabad-Dn | Monday | 29th September 1941 | Number 42

## మహాకవి రవీంద్రుని స్మరణ

భువనదహించిన బీరాయయనరాణిగారి అధ్యక్షతక్రింద హైద్రాబాదు-దక్కను నగరమందు రెడ్డిహాస్టల్‌లో సెప్టెంబరు ౧౯ వ తేదిన సమావేశమైన డాక్టర్ రవీంద్రనాధఠాగూర్ గారి సానుభూతి సభలో ఆర్, వి, పిళ్లెపతిగారు ఈ క్రింది ప్రసంగము చేసిరి:—

“ఆకారసదృశః ప్రజ్ఞః” అని కవికులతిలకుడైన కాళిదాసు గానముచేసెను. అనగా రూపమునకు తగిన ప్రజ్ఞ పోలికయుండునని అర్థము, ఈసత్యమును మనకాలములో కన్నులారచూడగలిగితిమి- రవీంద్రుడు ఆకారముచేత ఎంతసర్వజనరంజకుడో ప్రజ్ఞచేతను అంతప్రశంసనీయుడయ్యె రూపసౌభాగ్యము పూర్వపూజలఫలమైనట్లే మహా బహుళ కారాధనముల పరమసిద్ధి అని అనిరి- రవీంద్రుని నవనాసములు మోసినవి తుల్య- కులాంగనాసౌభవముశ్రీకార్థమైనవి- కుమారునిగా ఆయనకు బ్రహ్మోపదేశముచేసినవి సృహస్థధర్మము కూడా సఫలమైనది- కృత్యమువంటి పుత్రోత్సవరహస్యము ఇమిడియున్నది-

అయితే రవీంద్రుని బెంగాలీవారు తమవానినిగా చేసికొని గర్వింతురు. కాని ఆయననిఖిల లోకసర్వభాగ్య దాతగా ప్రకాశించినాడు మన బెంగాలీ భాషలో తన కంఠమువిప్పి పాడిన ఆమాధుర్యముచేత తిరిగి ప్రేమయందే లీనమగుచున్నది. ఇదే మహాకవిమధురమంత్రము,

ఈమాధుర్యవిధాతను నేను మిక్కిలి చిన్నతనములో చూచుభాగ్యము అబ్బినది. ఆయన బెంగాలు తమబంధువులయింటికి చుట్టముచూపుగా వచ్చిరి-అప్పుడు నాపెన్నిహితులు నన్ను వీణావాద్యముతో గానముచేయుమనిచెప్పిరి నేనువీణలో రెండుగానములు వాయించితిని. వెన్నవంటి ఆయన హృదయము కరిగినది. పితృవాత్సల్యమును గాయత్రభావమును రెండుకలిసి పైకివచ్చినవి- అంతట ఆయన ఆజానుబాహువైన కంఠమెత్తి ఒకగీతముపాడి చిన్నదానవైనను అప్పుడునాకు సంగీతమహాత్మ్యము సాక్షాత్కరించినట్లయినది. నాకుసంగీతమునందాసక్తి అప్పటినుండియు అధికమైనది- నా కన్నన్ను ఆశీర్వదించెను ఆమహా హిమాలయము వలె కన్యాకుమారి అనుమానవహృదయములను తడిపి తీయనయినవి అంతటితో ఆగలేదు. ఆయన ఈశ్వరార్పణముగా చల్లినగీతాంజలి మనహృదయమునందెంతో గొప్పదాతలుగా ఉండదంతట పరిమళించినది- రవీంద్రుడు పేరువినని దేశము ప్రపంచములో లేదు- ఆయనగ్రంధములు చదివి సంతోషపడని నాగరికులు అరుదు- ఆ కవనరచనలను పరివర్తనముచేసుకొనిన భాషలు పెక్కుచాలా కలవు.

ఇంతమహోత్తరమైన వాఙ్మయమును రవీంద్రుడు ఎట్లురచింపగలిగెను? ప్రాతిభా? ఆద్యపసంచమందున్న నాగరికవర్గములనెల్లను ఏలవిధముగ ఆకర్షించి ఆనందపెట్టగలిగెను? అనుభావములు మనకుతోచవచ్చును. ఈప్రశ్నకు ప్రత్యుత్తరముకూడా ఆయనకావ్యమునందే పొడకట్టుచున్నది రవీంద్రునికావ్యసృష్టిలో ప్రపంచమంతా సౌందర్యమయము, ఆచటజరిగే ప్రవృత్తిఅంతా మాధుర్యపూర్ణము- దీనికంతా ఆధారభూతము అనంతమా, తము,రవీంద్రుడు ప్రేమతపస్వి-అందుచే ఆయనకువికారము గాని వికారముగాని భయంకరములుగా కానరాదు- గులాబీపూలలో దిమకు మొండ్లులేవా? పద్మము బురదలో పుట్టుటలేదా? అట్టివానినిఅవిభాజ్యములుగా భావించెను- గులాబీపరిమళము సేవించెను- పద్మవికాసమునే పరిగ్రహించెను- ఆ ముండ్లను ఈపంకమును ఉపేక్షించెను- అవును మహానుభావుల ప్రేమసాధనకు ఇదేముఖ్యమార్గము అందువలననే వారుఎంతలేసి దుష్పరిపాలకములనుకూడా ఉపేక్షింపగలుగుదురు- వారు అవించినది సర్వసౌభాగ్యప్రదమైన ప్రేమమాత్రమే- ప్రేమచేత సృష్టి అగుచున్నది- ప్రేమబలమువలన వృద్ధి యగుచున్నది- నేడు నేనిట్లు స్వర్గస్థులైన రవీంద్రనాధమహర్షికి భక్తిశ్రద్ధలను అర్పించుటకు ఈయవకాశము లభించినది-

## దసరా ఊరేగింపు ఆయుధధారణ

### ప్రధానమంత్రిగారికి హిందూప్రజా మండలివారి మనవి

దసరాసమయంలో ఊరేగింపునందు హిందువుల ధర్మముప్రకారము ఆయుధములను ధరించవలెనన్నచో ఎటువంటిఆయుధములనుగాని ధరించితిరుగరాదను ఒకమ,ఘ,వ, నిజాంప్రభుత్వాజ్ఞ ఇపుడు అమలులోనుండుటవల్ల ఆటంకముగనున్నది- ఈఆటంకమునుతొలగించవలెనని హైదరాబాదు (దక్కను) హిందూప్రజామండలివారు మ-ఘ-వ- నిజాంప్రభుత్వమతాఖమంత్రిగారిని ప్రార్థించిరి- ఆమంత్రిగారికోరికపై సదరు మండలి ప్రధానకార్యదర్శియగు యశ్వంతరావు జోషీగారు ఈసెప్టెంబరు౨౦న తేదిన మంత్రిగారి వద్దకుపోయి ఈదసరాఊరేగింపునుగూర్చియేగాక మరికొన్ని యితరముఖ్యవిషయములనుగురించి కూడను భాషించిరి- కానిఅనుకూలఫలితము కలుగలేదు- అందుపైహిందూప్రజామండలి కేంద్ర సమితివారు సెప్టెంబరు౨౧న తేదిన క్రొత్తప్రధానమంత్రిగారికి దసరాఊరేగింపును ఆయుధములు ధరించిచేసుకొనుటకు అనుజ్ఞనొసగుమనివిజ్ఞప్తిని పంపుకొన్నారు-

### బీసెంటమ్మ జన్మదినోత్సవము

౧౯౪౧ అక్టోబరు ౧వ తేదిన సాయంకాలము, ౬గంటలవేళ హైదరాబాదు(దక్కను) నగరమున నవాబ్ అక్బర్‌యార్‌జంగ్ బహద్దర్‌గారి బంగళాకు ఎదుటథియసాఫికల్ సొసైటీ హాలులో డాక్టర్ అనీబీసెంటమ్మగారి జన్మదినోత్సవసందర్భమున సభజరుగగలదు- మౌల్వీసయ్యద్ అబ్దుల్ హఫీజ్ సాహెబ్‌గారు బీసెంటమ్మగారి జీవితవిశేషములను గురించి ఉపన్యసించగలరు_ హైద్రాబాదు(దక్కను) నగరథియసాఫికల్ సొసైటీఅధ్యక్షుడగు డాక్టర్ నవాబ్ నాజర్‌యార్ జంగ్‌బహాదర్‌గారు అధ్యక్షతవహింతురు_

### కీ. శే. వామననాయక సాంవత్సరికము

ఈఏడు కీ. శే. ధర్మవీర వామనన్నాయకుగారి సాంవత్సరికము హైదరాబాదు (దక్కను) నగరములో హిందూ సివిల్‌లిబర్టీస్ యూనియన్‌వారి యాజమాన్యమున ౧౯౪౧ అక్టోబరు ౧౦వ తేది శుక్రవారమునాడు జరుపబడగలదు- ఉదయము ఊరేగింపున్ను, సాయంకాలము వివేకవర్ధనీ దానములోగాని లేక గౌలిగుడెమునందు సుందర భవనములోగాని బహిరంగసభయుజరుగగలదు- ఈసభకు ఊరేగింపునకును క్రొత్తప్రధానమంత్రిగారు అనుమతినొసగగలరని ఈసాంవత్సరికోత్సవముల కేర్పాటుచేయువారలు నమ్మకముతోనున్నారు. ఇదివరలో ౧౯౩౮లోను ౧౯౩౯లోను, ౧౯౪౦లోనుకూడ ఊరేగింపులకు అనుమతినొసగియుండలేదని పాఠకులకుజ్ఞాపకముండవచ్చును

### కీ॥శే॥ నవాబ్ మొయినుద్దౌలా బహద్దరుగారు

హైదరాబాదుక్రికెట్ అసోసియేషను యొక్క రాజపోషకుడును హైదరాబాదులో క్రికెటుఆటలను ప్రోత్సహించుటలో అనేకులు ఇతరులకంటె ఎంతోఅభిమానము చూపినవారునగు నవాబ్ మొయినుద్దౌలాబహదర్‌గారు కొంతకాలమునుండి జబ్బులోనుండి ౧౯౪౧ సెప్టెంబరు ౨౪ వతేదిన భౌతికశరీరమును వీడిపోయిరి. ఈవియోగము క్రికెటుఆటలయందభిరుచి గలవారలకు గొప్పనష్టమనుచు హైదరాబాదు క్రికెటుఅసోసియేషనుయొక్క అధ్యక్షుడగు ఎ-కె-ముస్తాఫ్‌గారు కీ॥శే॥నవాబుగారి కుటుంబమునకు ఓదార్పులుప్రకటించినారు

### చరిత్రకాంగ్రెసు

హైద్రాబాదు చరిత్రకాంగ్రెసు డిసెంబరు తుదివారములో సమావేశముకానున్నది దానికి ప్రధానపోషకత్వమును మ-ఘ-వ- నిజాంగారు అంగీకరించియున్నారు.

## వైద్యులకు ప్రబోధము

నేడు ౧౯-౯-౪౧న తేదిన శ్రీపం॥ మ గ్గ రాయగుప్తసిద్ధాంతి (“దక్కను వైశ్య”పత్రిక సంపాదకుడు, (జ్యోతిషవాస్త్రవ్యుడు) తిరిపల్లకు వెంచేసి శ్రీయుత యిరుకుల్ల వెంకయ్యగుప్తగారి యింటిలోబసచేసి ఆ దేశోజా వారియి టియందు వైశ్యులనందరినిపిలిపించి ఉపన్యసించుచు “మీరందరు వైశ్యసంఘముచేర్పాటుచేసి సంఘముఅభివృద్ధిచెందింపుడు వేదాధ్యయనమునకు అధికారము వైశ్యులకున్నదని గాయత్రీమంత్రముతోజా ఉదయముజపించుకొనుడు. హవనము చేయుడు-యజ్ఞోపవీత గౌరవమును నిల్పుడనుచు నుపన్యసించిరి. మరియుమనసొమ్ము తినుకొని మనకుదిట్టినవారిందరికొకలరనుచు వేములవాడభీమకవిప్రాసినపద్యములు చక్కగాచదివివినిపించిరి, శ్రీపం॥ నారాయణరెడ్డిసిద్ధాంతరత్నగారుపన్యసించుచు “బ్రాహ్మణోస్యముఖమాసీత్, బాహూ రాజన్యః కృతః ఊరూ తదస్యయద్వైశ్యః పద్భ్యాగ్ం శూద్రో అజాయత” అనుమంత్రమునుచదివి అర్థమును విపులముగాచెప్పుచు సర్వాంగములలో వైశ్యులు తొడవంటివారనిగాని తొడ అనంతరఉత్పన్నముకాలేదనిచెప్పిరి, “పశూనాం రక్షణం దానమిజ్యాధ్యయనమేవచ వణిక్పథం చ కుసీదం చ వైశ్యస్య కృషిమేవ చ(మను) అను శ్లోకముచదివి అర్థముచెప్పుచు వైశ్యులుదేశమునకు ప్రాణమువంటివారనియు పసుస్తజనులకు వేదాధ్యయనము యజ్ఞోపవీతధారణగలదనియు గుణకర్మల ననియుచెప్పిరి తదుపరి శ్రీపం॥సుబ్బారాయ గుప్త సిద్ధాంతిగారు షట్చక్రవర్తులలో) అర్థగు వైశ్యులని కొన్ని పురాణప్రమాణములశ్లోకములచదివి అర్థముచెప్పుచు ఆరోజాసభచేసి పిల్లలు వైశ్యవ తులగుచటుల చేయుగఅందులకు పాటుపడుడనుచు వారిపత్రిక ఖర్చులకై కొంత డబ్బుసహాయము చేయుమనిరి. శ్రీ తిరిపల్లా వైశ్యసంఘమువారు నూటపదహార్లు సమర్పించిరి. దానికివారుఆనందించిరి, చం-౬-౨-౯-౪౧తో జాన శిక్రందాబాదు వెళ్లిరి

### దసరా ఉత్సవము

(ఆర్యసమాజము, సాపనవీధి సికింద్రాబాదు)

శ్రీవృష సం॥ అశ్వయుజ శు౧౦ ది॥౩౦-౯-౪౧ మంగళవారం ఆర్యసమాజము (సాపనవీధి సికింద్రాబాదు)నందు ఉదయము బృహద్యజ్ఞమున్ను, ధ్వజారోహణమున్ను, పగలు ౧౦ ఒ॥కు సమాజమునుండి శ్రీమాన్ పం. రాంరఘమల్‌గారి ఆధ్యాయాధ్యక్షతమున “ఓం” పతాకమును ధరించి మహావైభవముతో గొప్ప ఊరేగింపున్ను జరుగును. సకాలమునకు ఆబాలవృద్ధులు ఊరేగింపులోపాల్గొని విజయవంతము గావింప, తోడ్పడుదురు గాకయని ప్రార్థించుచున్నాము.

ఇట్లు,

యం. మునిస్వామి, మంత్రి-

## హరిజనవారము

మహాత్మాగాంధిగారి జయంతి సందర్భములో హైదరాబాదు హరిజనసేవకసంఘమువారు మ-రా-శ్రీ-రాజాబహదరు వెంకటరామారెడ్డిగారియాజకగాన్యమున శుక్రవారము 3 అక్టోబరునాడు సాయంత్రం ౬-౩౦ గంటలనుండి రెడ్డిహాస్టలులోసభజరుపుదురు ఆసందర్భములో కొందరువిద్యార్థులచే కొన్నిరంగములు ప్రదర్శింపబడును బహుగానములిచ్చబడును- ఉపన్యాసాలుజరుగును.

### హిందీస్వయం సేవకసంఘము

పైసంఘమువారు విజయదశమి మంగళవారమునాడుప్రొద్దున ౭ ౩౦గంటలకు వివేకవర్ధనిలో రాయ్ గణపతిలాల్‌గారి అధ్యక్షతలో సభజరుపుదురు

## అనావృష్టి బాధలు

వరంగల్లుతాలూకాలో హన్మకొండకుమూడు కోసులదూరములోఉండు కొండపర్తినుండి ఒక విలేఖరి అక్కడదర్శనములేనందువల్ల పైరుపంటలు లేక రైతులును, మేతలేక వ్యవసాయపశువులును వ్యవసాయపుకూలిపనులు దొరకక కూలివారలును దురవస్థలననుభవించుచున్నారనియు, అట్టిబాధితులకు పనులుకల్పించుటకై హనుమకొండ మట్టివానఅనుండి కొండపర్తికి ఒకబాటను, ఒకపాఠశాలను నిర్మించుప్రయత్నము పూనవలెననియు సూచించినారు.

మరియొకవిలేఖరి నల్లగొండతాలూకునుండిప్రతి పట్టిదారుకు ౩లేక౪రూపాయలకంటె ఎక్కువ యిచ్చేదిలేదని తెలుపవడినట్లువ్రాసినాడు- అట్టి మొత్తములో మామూళ్లుగాఇచ్చేదిపోను ఏఒకటియో, అర్ధనాత్రమేకగామిగిలేది యని రైతులు నిరుత్సాహముతో నున్నారట.

### నాందేడు హిందూప్రజామండలి

నాందేడు హిందూప్రజామండలి కార్యదర్శి మ భవరావు నాందేడ్కర్ బి.ఏ.ఎల్.ఎల్.బి. గారు నాందేడుమండలియొక్క వార్షికోత్సవమునుజరుపువిషయమున పనిపై హైదరాబాదు (దక్కను)నగరమునకువచ్చియున్నారు. ఈవార్షికోత్సవము నాందేడులో రాబోవునవంబరు నెల ౧౨ ౧౩,౧౪ తేదులలో జరుగగలదు. శంకరరావుబూర్గాపూంకర్, బి ఏ,బారిస్టరుగారుఅధ్యక్షతవహించెదరు. ఇపుడువార్షికోత్సవముకొరకు అవసరమైన ఏర్పాట్లుజరుగుచున్నవి, ఆజిల్లాలో ప్రతితాలూకానను జిల్లామండలిశాఖలేర్పాటుచేయబడుచున్నవి

## వరంగల్లు

### గణపతి ఉత్సవములో అల్లరులు

(స్వ.వి.)

ఈగ్రామమున గణపతిఊరేగింపులో అల్లరిజరిగినతర్వాత, రెండురోజులవరకు అధికారులు, గామములందగిలిన హిందూ ముసల్మానులనుండి వాఙ్మూలములుతీసుకొని సుమారు (౧౦)మంది ముస్లిములను రిమాండుచేసి జమానతుపై విడుదలచేసిరి.

మరి యీరెండుమూడురోజులనుండి సుమారు [౧౫౦]మంది హిందువులకు వారంటు అయినదని లేపోమాపో తీసుకవెళ్లనున్నారని ప్రబలమైన వదంతులు బయలుదేరినవి

### శుద్ధఖద్దర్ భాండాగారం- ఖాదీ ప్రచారక సభ యేర్పాటు

ఈగ్రామమున నాల్గు రోజులనుండి చౌరస్తాలో చరఖాసంఘమువారు ఒకవస్త్రాలయిమే గాటుచేసినారు. అందు ౩-౧౦-౪౧ తేదీన సాయంత్రం రయ్యత్ పత్రికాధ్యక్షులగు మందుములనర్సింగరావుగారి యాజమాన్యమున ఖాదీప్రచారకసభ జరిపి జిల్లాసంఘమేర్పాటుచేసి రాజశ్రీ పర్వారంగారావుగారిని అధ్యక్షులుగా యెన్నుకొనునున్నట్లు తెలియుచున్నది.

### చందూలాల్ బారాదరీ

ఈబంగ్లాను మహారాజా కిషన్‌ప్రసాదు గారు సఫాయివారికి దానమిచ్చియుండిరి. ఇప్పుడు సఫాయివారు దానిని పెండ్లిల్లుగా ఏర్పాటుచేసినారు పెండ్లిండ్లుచేసుకొనువారికిదాని నియ్యగలరు-

ప్రారంభము

గురువారం 25 వ తేది సెప్టెంబరు 1941 దసరాకు ప్రత్యేకమ్యాట్నీలు

తల్లిప్రేమ

తల్లిప్రేమకుసాటి - ధరణిలేదు

కన్నతల్లిమనసు వెన్న కన్న కుసుమకోమలమైనది. బిడ్డకుకష్టం రాకపూర్వమే – కష్టమస్తుందేమో అని ఆందోళనపడుతుంది. బిడ్డకుకష్టం రాకుండా ఉండడానికి బిడ్డకుకష్టంకల్గినప్పుడు దానికి - తానెన్నికష్టాలైనా పడుతుంది కనబిడ్డప్రాణంతో సవప్రాణాల్ని ముడిపెట్టిన తల్లిప్రేమను మించిన ఇంకో ప్రేమ యీజగత్తులో బహుశ లేదు నేను నాటినాత్మ నీటినాత్మ – ఒక్కటేనేను కాను. అనే సిద్ధాంతాన్ని యీ తల్లిప్రేమ ఫిల్ములో చూస్తే ఎండినప్రాణాలు చిగిరిస్తాయి, ఈ ముపల్లవిస్తుంది కల్లకపటమెరుగని నిష్కళంకమైన తల్లిప్రేమను తెరమీద చూపగలిగినతార ఎవరు కన్నాంబ-కన్నాంబ నటించినఫిల్ము కన్నారచూచి మీరుచాలకాలమైంది గృహలక్ష్మిలో చూచారు పెదాన్! అనిమెచ్చారు మళ్లీ నాటికి నేటికి కన్నులకరువుదీర కన్నాంబనటించిన ఫిల్ము ఇదుగో

శ్రీరాజ రాజేశ్వరీవారి

తల్లిప్రేమ

నటీనటులు:—కన్నాంబ, సి- యస్- ఆర్ ఆంజనేయులు, హేమలత శేషమాంబ బుచ్చేంద్రమణి, రఘురామయ్య, పులిపాటి,సీతారత్నం.

సాగర్ టాకీస్

త్రూపుబజార్ - హైద్రాబాదు.

నోటు:— దసరాపండుగలకై స్పెషల్ మ్యాట్నిషోలు పగలు 2-30 గంటలకు చూపబడును. సోమవారము 29-9-41 నుండి బుధవారము 1-10-41 వరకు మూడురోజులు మాట్నిషోలు ప్రదర్శింపబడును.

రాయల్ హోటల్ ఫోను-3462

మీరుహైద్రాబాదువచ్చినప్పుడుమాహోటలుకు తప్పక దయచేయండి. బి.జి.స్టేషనుకుదగ్గర అన్నివిధముల నూతనసౌకర్యములు. శాకాహారులకును, మాంసాహారులకును కూడ ప్రత్యేకఏర్పాట్లు దయచేసి ఒకసారి పరీక్షించండి.

Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad Dn. Editor S. Prathapa Reddy B. A. B, L.